# హరిజనుని విలాపము

"ఇది వైశ్య మందిరము, కనుక ప్రవేశించుటకు వీలులేదు"

మెదకు ముచ్చట

భాద్రపద మాస శుద్ధ దశమినాడు మెదకులో వేలూరు వరదాచార్యులు హరికథ జెప్పుచున్నారని కర్ణాకర్ణిగా విని మిత్రులతో గలసి రాత్రి 8 గంటలకు బయలుదేరి నియమితస్థానము బహుప్రయత్నమున గనుగొని మందిరములో నసందిగ్ధమనస్కుడనై ప్రవేశించితిని. జనసమ్మర్ద మధికముగనుండెను. కూర్చుండ జోటు లేమింజేసి మేము వెనుక నిలుచుండి యుంటిమి. ధర్మరాజు గోత్రవధంజేసి పొందిన దోషంబునకు వాపోవుచుండ వ్యాసభగవానుడు వచ్చి, "అశ్వమేధ యాగము జేయ నుపక్రమించుము. అంత గోత్రవధ మకరముపాయు"నని శాంతింగూర్చు కథా భాగము నడచుచుండెను. ఇంతలోనొకడువచ్చి "సీతారామ శాస్త్రులు" పిలుచుచున్నారని సెలవిచ్చెను. వారికిని నాకును బూర్వపరిచయము లేదు. కాని యువారెవ్వరో మా సంచితానమును లక్షించి పిలుచుచున్నారని పరితుష్ట మానసుడనై వెళ్ళితిని. వారు మందిరద్వారమున కవతల నిలుచుండియుండిరి. కొంతవడికి నామిత్రులను సహితము పిలువనంపిరి. మూడు నిముసముల కాలము గడువ "ఇది వైశ్యమందిరము కనుక ప్రవేశించుటకు వీలులేదు." అని నిరాదృతింబలికి మందిరాంతః ప్రవిష్టులైరి. మాటలాడుటకవకాశమేదీ? మాటలాడిన నదియెట్లు పరిణమించునోయను సంశయమొకటి. కాన జేయునదిలేక మౌనముద్రితుడ నైతిని. అపాదమస్తకము ఘర్మమయమాయెను. క్రమ్మఱి స్తంభీభూతుడనై యట్లే నిలుచుంటిని.

నా చెవిని యింకను మ్రోగుచున్న "ప్రవేశించుటకు వీలులేదు" అను పల్కులు ఆ ఘోషవిశాస్త్రములై పెలంగ, మనంబునకలి తెగ్నాద్ర ద్దనై చాలనని మిత్రద్వయ సహితము గాంగాలికి బుద్ధిజెప్పితిని. మిత్రులు జరిగిన తిరస్కారమునకు నవ్వుకొనుచుండిరి. నాకుమాత్ర మూరటకూడదు. ప్రాప్తించిన పరాభవమునకు ప్రతిక్రియవిచారించ శపథముగొంటిని గాని "సేవకోపము పెదవుల చేటు"ను సామెతస్ఫురించెను. ఇట్లాందోళనా మనస్కుడనై నడచి వెళ్ళుచుండ నన్మన్మిత్రులు చెప్పుచున్న సంగతులు నాయందు బధిరశంఖన్యాయసామ్యము బొందనిల్లు సేరితి.

దేవనామ సంస్మరణజేసి శయ్యపై మేను వాల్చితిని. అబ్బో మందిరముకడ పొడసూపిన క్రోధానలము పెచ్చుపెరిగి నానునాను. వనవహ్నియై దేహాన్యమును గాల్చుచుండె. ప్రతీకార ప్రతిజ్ఞా ప్రవాహము పైపైకి పొర్లి విడియుచుండె. ఇట్లుటిట్లాత లాగుచున్న మనంబునసంగొంతవడికి యత్నపయత్నము గా నే శాంతిగల్గినది. "ఈసంగతి గోలకొండలో ప్రచురింతును" అని నిద్రించితిని.

హిందూ బృందమా! ఇందలి న్యాయాన్యాయముల గొంతవరకు విచారించుడు. ఈశ్వరోపాసనమందు నిర్బంధముగలదా? హరిజనులు వైశ్యదేవతా మందిరము ప్రవేశించ గూడదను నియమము ప్రతిపాదింపబడి యున్నదా? ఈశ్వరార్చన స్వేచ్ఛామాత్ర కర్మయని యెఱుంగరా? కులాచార భేదంబుల సహించువాడు దేవునకు ద్రోహచింతనము జేయువాడు.

సకల వేదశాస్త్ర పురాణేతిహాసజ్ఞుడా యగ్రకులజుని జ్ఞానముకన్న విద్యావిహీనుడు పామరుని భక్తి దేవుని కానందదాయకము. విచిత్ర మణిమండిత దేవాలయము కట్టింపగల్గిన పెదభ వైశ్యులధనము భగవంతుని మెప్పింపజాలదు గాని దేవార్చనకై వైశ్య మందిరములనుండి వెలివేయబడుచున్న హరిజనుల యవ్యాజభక్తి భగవద్భక్తి దేవుని స్వాధీనము జేసికొన జాలదయని దెలియవలె. ఇప్పుడిప్పుడు జ్ఞానాదిదానములందును నిస్సహాయస్థితి కులాంభకులగల విపర్యాసమేల? ఆలోచించుడు.

స్వరాజ్య కాంక్ష గలవారలారా! ఐక్యత లేక స్వరాజ్యాగమోద్యమమునకు గడంగుట రాతిని చెప్పకొయ్యజేసి సముద్రమీద దలంచుటని యెఱుంగుడు. ఐక్యతనెఱపని మీరు స్వరాజ్యలాభమును గోరుదురా? ఇంటనున్న యెలుకను జంపక బయటనున్న పందిని జంపబోయెనన్నట్లున్నది మన వ్యవహారము.

వర్ణభూతమా! ఎంత బలశాలివే. సంస్కర్తలెందరో నీతోబోరు సల్పుచున్నను, దలుగని సాహసమున డీకొనుచున్నావు గాని "జితోస్మి"యని తోక ముడుచుకొని యుండవు. హరిజన భక్తులనింక నెందఱ బొట్టబెట్టు కొందువాయని యున్న నీకు తీవ్రజ్ఞాన పరశుఘాతము ప్రాప్తించకుండునా? కులాచారములు శ్రేయస్సుకై అవశ్యాచరణీయములని అనుచున్నావు. నీమాటలు దేశారిష్ట మంత్రాక్షరములు.

"మేము నమ్మిన దేవుని బూజించుటలో నెట్టినిర్బంధములు లేవు. ఆ పరమాత్మని యాలయ ప్రవేశమునకెట్టి వాక్యతతోను కులముతోను వృత్తితోను బనిలేదు. తానగ్రకులజాలనను గ్రహించి పంచముల నిగ్రహించడు. భగవదుపాసకులు నిస్సంశయముగ ప్రవేశింపవచ్చును. రండు, పరిశీలనా బుద్ధితోగాక ముక్తిదాయకుని పాదపూజా భాగ్యానందము ననుభవించు కోర్కెంజనుడు."

మొలతాటి. విద్యానందము

---

# కరణం దొరపై పోలీసులతో మొఱ

పోలీసుల పంచునామా

(ఒక విలేఖరి)

పినపాక; ౮-౧౨-౮౮ ఫ:

సుమారొక ౧౦—౧౫ రోజులక్రింద, పినపాకలో నొక చాకలివాడు ఆ గ్రామంలో కరణం దొరపై పోలీసులకు యేదో షికాయతు చేసెను. దానిపై పోలీసువారు వచ్చి పంచునామా చేసికొని పోయిరట. చాకలివాని శరీరముపై దెబ్బలు కొట్టినట్లు గుర్తులుగలవు. చాకలివాడు యీదెబ్బలకు కారణం ఆకరణందొరవారేనని పోలీసులకు దరఖాస్తు నిచ్చియుండెనను చున్నారు. బలవంతముగ వెట్టిచేయించుకొను విషయమున సంఘర్షణలో యిదిసంభవించెనని అనుచున్నారు. దెబ్బలు కొట్టుచున్నప్పుడు కొందరు జనులు యేకమైపోయి, విడదీసిరి. ఇతర పనివాండ్రు కూడ చాకలివాని దెబ్బలుచూచిన మఱుసటి దినమునుండి వెట్టిచేయుట మానుకొన్నట్లు కనబడుచున్నది.

---

# వ్యవసాయశాఖ నాజముగారి దౌరా

వీరు మహబూబునగరము జిల్లాలోని కల్వకుర్తి, నాగర కర్నూలు, అమరాబాదు మున్నగు ప్రాంతముల దౌరా చేసివచ్చిరి. మహబూబు నగరముగూడ జూచిరి. అనేక ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రములను పరిశీలించిరి. ఈ సందర్భమున నేనేరములు చేయుజాతులవారి స్థిరనివాసము కొరకు ఏర్పరుపబడిన సెటిలుమెంటు ప్రదేశమునకు మాచవెళ్ళి అచ్చటి ఏర్పాటులు కనగొనిరి.

---

# మంథనిలో రజతోత్సవపు యేర్పాట్లు

ప్రభువుగారి రజతోత్సవపు ఏర్పాటులు జరుగుచున్నవి పటేలు పట్వారీలు తమ స్కూలులో నాటికి రు ౧౦ చొప్పున నిచ్చుట కంగీకరించిరి రుద్రారము మక్తేదారు రామినేని వేంకటేశ్వరరావుగారు తమ గ్రామములో మంచి ధర్మశాల కట్టింతుననిరి కల్లెశ రామన్నగారు కూడ తమ గ్రామమున నట్లే చేతుమనిరి. మౌ. రషీదుద్దీను వకీలుగారు తెనుగులో ఉపన్యాసము చేసి చందానివ్వవలెనని ఇతరుల ప్రోత్సహించిరి కటికనేని పాపయ్య, మక్తేదారుగారు కందరూపాయ లిత్తుమనిరి.

---




## ౧౩౪౩ ఫ. లో వెడలిన పుస్తకములు

హోంసెక్రెటరీ కార్యాలయ ప్రకటనలచే తెలిసిన విషయాలు

మన రాష్ట్రపు హోంసెక్రెటరీగారి కార్యాలయమువలన ప్రకటింపబడిన మురాసిలా (లేఖల)వలనను, పుస్తకములపట్టికలవలనను తెలియవచ్చిన సంగతులు ఇవి:—

ఈ వత్సరము ప్రకటితములైన పుస్తకములు, నగరములో 469, జిల్లాలలో 93. మొత్తము 562. వెనుకటిదగు 1342 ఫ. లో 560 మాత్రమే వెలువడినవి. కనుక 2 పుస్తకములు హెచ్చినవి.

వీనిలో మతగ్రంథములు, నీతిపుస్తకములు, వేదాంతము, కావ్యములు, ఖానూను, ప్రకృతి శాస్త్రములు, కథలు, వ్యవసాయవిషయికములు, నాటకములు, నిఘంటువులు, నవలలు, సంగీత గ్రంథములు మున్నగునవియన్నియు కలవు.

భాషలనుబట్టి వాని వివరములు:—

| | |
|---|---|
| ఉర్దూ | 279 |
| ఉర్దూ + ఇంగ్లీషు | 23 |
| ఉర్దూ + అరబ్బీ | 47 |
| అరబ్బీ | 4 |
| ఉర్దూ + ఫార్సీ | 7 |
| ఉర్దూ + తెనుగు | 8 |
| మరాఠీ | 3 |
| తెనుగు | 21 |
| హిందీ | 9 |
| సంస్కృతము | 1 |
| ఫార్సీ | 3 |
| సంస్కృతము + హిందీ | 1 |
| ఇంగ్లీషు | 21 |
| రోమను | 2 |

(వీటి మొత్తము 429 అగుచున్నది. లెక్కైన పట్టిలో కనుపడదు.)

ఇదిగాక అలభ్యములగు అరబీ ఉద్గ్రంథములు "జ్వాయతుల్ ముఆరిఫ్" అను పురాతన గ్రంథ పరిశోధక శాఖవారివలన ప్రకటింపబడినవట! (ఈసంస్థ మన ప్రభుత్వమువారివలన పోషింపబడుచున్నది.)

నివేదిక వత్సరమున 27 పుస్తకములు రిజిస్టరయినవి. గతవత్సరము నిట్టివి 18 మాత్రమే యుండెను.

1342 ఫ. లో 18 ముద్రణాలయములు క్రొత్తగా స్థాపింపబడుటకు మంజూరి యియ్యబడినది. ఈసంవత్సరము అట్టి అంగీకారభాగ్యము పొందిన ముద్రణాలయములసంఖ్య జిల్లాలలో 5 నగరములో 4. మొత్తము 9.

1343 ఫసలీలో "గోహరు" అను ఉర్దూ మాసపత్రికయొకటి ప్రచురణకు అంగీకారము పొందినదట!!

---

### క్షామబాధితుల నిధి

రాజాబహాదరు వేకటరామారెడ్డి ఓ. బి. ఇ. గారి ఆజ్ఞానుసారము శ్రీయుత జి. రఘునాథమల్లు, బ్యాంకరుగారు మరియొకవేయి కల్దారు రూపాయలు జైన్ రాయ్ భూకంపనిధికి పంపిరి. దీనితో మొత్తము 20 వేల కల్దారులు పంపుట జరిగినది.

---

## గణపత్యుత్సవపు ఊరేగింపులు

శాంతము గా జరుగుట

సికింద్రాబాదులో ఊరేగింపులు శాంతముగా జరిగెను. పోలీసు ఏర్పాటులు బాగుగ నుండినవి.

హైద్రాబాదులోగూడ నీయూరేగింపులు, ఉత్సవములు జయప్రదముగా జరిగినవి. పోలీసు ఏర్పాటులు చురుకుగా చేసినందునకు కొత్వాలుగారు ప్రశంసింపబడుచున్నారు. ఊరేగింపుల సందర్భమున వీరు స్వయముగా వచ్చియుండిరి. హిందూప్రజలు వీరిని పుష్పమాలలతో సన్మానించిరి.

---

## ఆకస్మిక విపత్తులు

6 అబాను నాడు జాకారమునుండి సికింద్రాబాదునకు 32 సం॥ వయస్సువాడు రూపాయలసంచులు తీసుకొని పోవుచుండగా మోటారుతాకి గాయపడెను. అతడు వైద్యశాలకు పంపబడెను. ద్రవ్యమును పోలీసువారు నిగరానిలోనికి తీసికొనిరి.

ముషీరాబాదు ప్రాంతములో ఒకస్త్రీ వర్షము సమయమున పనిచేయుచుండగా లింగంపల్లి తోటగోడ కూలి పైనబడినందున చనిపోయెను.

---

### పత్రికాధిపతులకు విన్నపము

లోకజ్ఞానములేని వెనుకబడిన దీన ఆదిహిందు ప్రజలయున్నతికొరకు స్థాపింపబడిన యుచితవాచనాలయమునకు దయగల ఉదారదాతలగు పత్రికాధిపతులు, తాము ప్రకటించువార్తాపత్రికలు ఉచితముగా అనుగ్రహింప ప్రార్థింపబడుచున్నారు.

అడ్రెసు:—

ఆదిహిందు ఉచితవాచనాలయము,
"ఆదిహిందుభవనము", చాదర్ఘాటు,
హైద్రాబాదు [దక్షిణ].

---

### వ్యాసకర్త

ఈ సంపుటము 34 వ సంచికలో 14 వ పుటయందు "ఆరోగ్యము—వైద్యము" అను శాఖలో యీయబడినవ్యాసము శ్రీయుత టి. జగన్నాథరావుగారు వ్రాసినది. వ్యాసముయొక్క సర్వస్వామ్యము వారిదే.

గో. ప. సం.

---

### హైదరాబాదు కాంగ్రెసుసంఘము

ఈ పైచెప్పిన కాంగ్రెసు సంఘము మొన్న 2 అబాను ౧౩౪౪ ఫ. నాడు సాయంకాలము సంఘముయొక్క అధ్యక్షులగు శ్రీయుత వామన్ నాయకుగారి యింటిలో సమావేశమై సాధారణవిషయములనుగూర్చి చర్చజరిపెను. సెప్టెంబరు ఆఖరువారము అక్టోబరు మొదటివారములలో గాంధీజయంతి జరుపుటకు నిశ్చయించెను.

---

### ఆదిహిందు ఉచితవాచనాలయ ప్రారంభోత్సవము

గత 11-9—35 తేదిన ఆదిహిందుభవనములో శ్రీమాన్. రాజనాలలక్ష్మీపతి, కంట్రాక్టరుగారధ్యక్షతలో వాచనాలయప్రారంభోత్సవము జరుపబడెను. భజన ప్రార్థనోపాసనానంతరము అధ్యక్షులవారిచే, శ్రీనిజాం ప్రభువుగారి పటమునకు పుష్పహారసన్మానము జరుపబడెను. తదుపరి స్వర్గవాసి నవాబు ఫక్రుల్ ముల్కు బహదూరు ఆత్మశాంతికొరకు ప్రార్థన, శ్రీ॥ శ్రీ॥ జాతిసేవక ఎస్. చంద్రయ్యగారిపటము బహిర్గతము చేయబడెను. అంతమున అధ్యక్షులవారు ఆదిహిందు భవననిర్మాణ నిధికి రూ. 50|— విరాళమొసగి సభచాలించిరి.

ఇట్లు,
సెక్రటరి, ఆదిహిందు సాంఘిక సేవాసమితి.

---

### రాకపోకలు

టప్పాఖానా శాఖ నాజముగారు ఆసిఫాబాదు జిల్లాకు వెళ్ళిరి. ౧౬ అబాను నాటికి తిరిగి వత్తురట!

---




# గోలకొండ పత్రిక

యువ సం॥ భాద్రపద శు॥ ౭

గురువారము


## కల్లు సారాయి ప్రభావము

సుప్రసిద్ధమైన తుల్జారాం మొకద్దమాలో కడపటి తీర్పుచెప్పిన మన ఉన్నత న్యాయస్థాన ప్రధాన న్యాయమూర్తులగు నవాబ్ మిర్జాయార్జంగు బహదర్ గారును, గాజియొద్దీన్ అహమదుగారును జరిగిన హత్యా సంబంధములగు నేరములలో కల్లుసారాయిల ప్రభావమునుగూర్చి చెప్పిన అభిప్రాయము, ప్రతివానిచేతను గమనించ దగినదై యున్నది. వారు చెప్పిన వచనములివి:

"కల్లు సారాయి త్రాగుటవలనకలుగు దుష్ఫలితములు కొంతవరకు యీ నేరములకు కారణములై యుండెను. ముద్దాయీలు నేరము చేయుటకు ముందు ఆ దుష్ఫలితములకు అధికముగా వశమై తాము యేమిచేయుచున్నదీకూడ తెలియక యుండిరి. ఆ దుష్ఫలితమునుండి వారు తప్పించుకొనజాలకపోయిరి.

ఇదే విధముగ జాగ్రత్తగ గమనించుచో, నేరములలో ననేకములకు అనర్థములు కల్లు సారాయి దురభ్యాసమునకు జనులు వశమైనందువల్ల యేర్పడినట్లు తేలగలదు.

కాని జనులు త్రాగునప్పుడు వారికి దానిరుచియు, దానివలన తాత్కాలికముగ కలుగు శ్రమాపనోదమును మాత్రమే దృష్టికి వచ్చుచుండును గాని అది తుదకు తెచ్చుచేటు దృష్టికిరాదు. ఇట్టివే తామసాహారములు నేడు మొదలే తమస్సుకు (మాంద్యము, అలసత, మూఢత్వము మొదలైనవి యీ ప్రకృతికి లక్షణములు) చాల అధికముగా లొంగిపోయియున్న మన భారత జాతిని త్రాగుడు దోషము మరింత తీవ్ర ప్రకోపమునకు గురిచేయుచున్నది. భగవద్గీతాకారుడు "మొదట అమృతమువలె నుండి అంతమున విషమువలె పని చేయు" నని యే లక్షణమును జెప్పియున్నాడో అది కల్లు సారాయందు సంపూర్ణముగ నున్నది.

మనరాష్ట్రము చిరకాలమునుండి యీ మద్యములయొక్క వశమైయున్నది. కాని యిటీవల—చాలమట్టుకు ఆర్థికదుస్థితి వలన డబ్బులేని కారణముచేతనే యని యధికారుల అభిప్రాయముకూడ— త్రాగుడు మనరాష్ట్రమందు ౧౩౩౯ ఫసలీలో ౯౧౦౯౭౨ గ్యాలనులనుండి ౧౩౪౩ ఫసలీలో ౬౯౭౩౭౩ గ్యాలనులకు తగ్గినది. ఈ తగ్గుదలలోని యెక్కువభాగము ఆర్థిక దుస్థితిచే కలిగినదైనచో మరల రేపు మేము యుద్ధమువల్లనో మరి యేయితర కారణములవలననో ఆర్థికదుస్థితి పోయినచో, తిరిగి త్రాగుడు పూర్వస్థితికి రాగలదని భయపడవలసినదే అయితే మన ప్రభుత్వపు అబ్కారీ శాఖవారి ౧౩౪౩ ఫసలీ నివేదికలో "షాప్ వారి ఆక్షన్ పద్ధతి మరల త్రాగుడు పూర్వపు స్థితికి రాకుండ ఆపగలదని నమ్ముచున్నారు. కాని అంత మాత్రముతో తృప్తిపడి ఊరకుండుటకు అవకాశములేదనుట నిశ్చయము. అంతకంటె నుకతినమైన చర్య అవలంబించ బడవలెను.

౧౩౪౩ వ ఫసలీ అంతమైనతర్వాత మన ప్రధానన్యాయమూర్తులగు నవాబ్ మిర్జాయార్జంగు గారియొక్క అధ్యక్షతతో ఒక మితపాన ప్రచార సంఘము యేర్పరచబడి యుండెను. ఆసంఘము యింతవరకును బహుశా అబ్కారీశాఖకు సూచనలనిచ్చుచు త్రాగుడు తగ్గించుటకు యత్నించి యుండవచ్చును. సాధారణముగా మితపానసంఘముల యుద్దేశము త్రాగుడును తగ్గించుట. త్రాగుడును తగ్గించుట అను ఉద్దేశముతో తృప్తిపొందక త్రాగుడును నిర్మూలించు నుద్దేశముతో పని ప్రారంభించినచో మంచిఫలితము కనబడునని మా విశ్వాసము. లంకణము పెట్టినగాని పథ్యమునకు దిగదను సామెత ఊరక చెప్పినారా!

## మరల బుట్టదాఖలు, క్రిమినల్ లా సవరణబిల్లు

రాజప్రతినిధిచే శిఫారసుచేయబడిన క్రిమినల్ లా అమెండుమెంటు బిల్లును ప్రవేశపెట్టవలెననుఉపపాదనము సెప్టంబరు ౧౬ నాడు భారత శాసనసభలో 57-69 వోట్లచే నిరాకరింపబడెను.

## లంచాలు

ప్రభుత్వోద్యోగులు లంచాలు తీసికోరాదు. కాని యిటువంటి గడ్డి గరిచే గుమాస్తాలు, ఉద్యోగులు యెక్కువగా వున్నారు యే యిలాఖాలో చూచినా. న్యాయస్థానాలలోని గుమాస్తాల లంచగొండితనము యెక్కువ అయినందువల్ల దీనిని తగ్గించడానికి నిజాము సంస్థానపు ఉన్నత న్యాయస్థాన కార్యదర్శి యీ లంచాలబాధనుండి ప్రజలను తప్పింపదలచినాడు. ఇందుకు ప్రజలు యీ ఉద్యోగికి వందనములు అర్పిస్తారు. ఏమాత్రపు చిల్లరపని జరుగవలసినప్పటికిని ౨ల్లక్రింద చెయ్యి ప్రత్యక్షము. ఇటువంటి లత్యము గల వారి గురించి తనకు తెలుపవలసిందంటూ కార్యదర్శి ప్రకటనమి. ఈలంచగొండితనము విషయములో స్వదేశ సంస్థానములకన్న బ్రిటిషు ఇండియా కార్యాలయాలు యెన్నోరెట్లు మేలు. కాని యిక్కడకూడ యీ లంచగొండి మొండిచేతిమీద ప్రభుత్వము ఒక చురకవేయక తప్పదు. అలాచేస్తే చేపల అవస్థలు కొంత తగ్గుతవి.

—ప్రజాబంధు.

## ప్లేగు ఋతువుకు నిబంధనలు

### ప్రజలకు హెచ్చరిక

ప్లేగుకు తగినకాలమువచ్చినది. ఉస్మానాబాదు, మెదకు జిల్లాలనుండి ప్లేగు కొందరికి తగిలినట్లు వార్తలు తెలియుచున్నవి. ఖైరతాబాదులో ముగ్గురికి ప్లేగు తగిలినది

ప్రభుత్వమువారు జారీచేసిన యీక్రింది ప్లేగునిబంధనలను హైదరాబాదు ప్రజలు గమనించవలసినదని యిందు మూలమున ప్రజలను కోరుట యైనది.

నేరములు: శిక్షలు:—

౧. ఈక్రిందిఆజ్ఞలనుయెవడు అతిక్రమించునో అతనికి ఒక నెలవరకు కారాగారవాసముగాని, రూ ౧౦౦ లవరకు జుర్మానాగాని, లేక రెండునుగాని విధింపవచ్చును. ఈ దఫా క్రింద నేరములను పోలీసువారు కనిపెట్టి చర్యగైకొందురు.

(క) ప్లేగు వ్యాపించియున్న కాలములో ఎలుకగాని, ఉడుతగాని, కోతిగాని, పిల్లిగాని పైనుండి క్రిందపడినను, చచ్చినను, లేక యెవనియింటిలోగాని ప్లేగువల్ల యెవడైనను జబ్బుపడియున్నను, ఆయింటివాడు వెంటనే ఆ సమాచారమును సబ్ అసిస్టెంటు సర్జనుకుగాని, హెల్త్ యిన్స్పెక్టరుకుగాని, లేక ప్లేగు శాఖలోని హెల్తు సబ్ యిన్స్పెక్టరుకు, లేక ఆవార్డుయొక్క మునిసిపల్ అమీనుకుగాని తెలియపరచవలెను.

(ఖ) ప్లేగువలన మరణించిన యెవరియొక్కగాని శరీరమును ౧౧ వ క్లాజులో చెప్పబడినవిధమున ఆ మరణ సమాచారమును అధికారులకు తెల్పిన తరువాత ౬ గంటలవరకు కూడ పూడ్చిపెట్టకూడదు, కాల్చకూడదు.

(గ) మొదట ప్లేగు తగిలిన యేప్రదేశమునకుగాని సలహాకైగాని, మరి దేనికైగాని ప్లేగు తగిలినవాని వద్దకు పిలిపించుకొనబడిన ప్రైవేటు డాక్టరుగాని, హకీంగాని, వైద్యుడుగాని, అసమాచారమును వెంటనే స్పెషల్ ప్లేగు ఆఫీసరుకు వ్రాతలో తెల్పినచో, అతనికి అట్లు తెల్పినందుకుగాను రూ. ౧ ఫీజు యివ్వబడును. అట్టి ప్రతి ప్రైవేటు డాక్టరు వద్ద ప్లేగువల్ల బాధ పడుచుండు యే రోగియొక్కగాని పేరును, వారు స్పెషల్ ప్లేగు ఆఫీసరుగారికి తెలియపరచ గలడు.

[ఘ] ఈ నిబంధనలను అమలుపరచుటకై నియోజించబడిన యే అధికారిగాని తనకు శాసనప్రకారము యివ్వబడిన విధులను చేయునప్పుడు యెవడుగాని అతనికి యేవిధముగాని ఆటంకము కల్పించరాదు.

[ఙ] ప్లేగుతగిలియున్న యేప్రదేశమునుండిగాని యెవడుగాని స్పెషల్ ప్లేగు ఆఫీసరుయొక్క అధికారములేనిది ప్లేగులేని యే జననివాస ప్రదేశములోగాని పోయియుండరాదు; అయితే హెల్త్ క్యాంపులోగాని, జననివాసములకు వెలుపలను, పురపాలకసంఘమువారి అధికారమునకు లోబడిన సరిహద్దుల వెలుపలను, లేక పురపాలకసంఘమువారు నిర్ణయించిన ప్రాంతముగాని ఉండు యేయింటిలోనైనను తాత్కాలికముగా గాని శాశ్వతముగాగాని ఉండుటకు నిషేధములేదు. [నిబంధన నెం. 27 చూడుడు]

[చ] స్పెషల్ ప్లేగు ఆఫీసరుగారి అనుమతిలేనిది యెవడుగాని హెల్తుక్యాంపునుండి ప్లేగు ఉన్నప్రదేశమునకు గాని యింటికి గాని రాకూడదు

ఈనిబంధనలు నగరమును ప్లేగునుండి రక్షించుటకై ప్రభుత్వమువారిచ్చిన ఆజ్ఞ ననుసరించి తయారు చేయబడినవి. వీటిని అమలుపరచుటలో ప్రతివాడును తోడ్పడగలడని వైద్యశాఖవారు చాల ఆత్రముగా నున్నారు.

ప్రతివారును ఎలుకలను చంపుటయందును, ఎలుకలబొందలకు గంధకము పొగవేయుటలోను, యింకను ప్లేగునిరోధముకై వైద్యశాఖవారు గైకొను యితర చర్యలలోను తోడ్పడుదురుగాక!

## కాలమాన నివేదిక

౨౯ మెహార్ ౧౩౪౪ ఫ. తో ముగియు వారమునకు

( ఎడాదెప్పమారెను డి )

వాతావరణము:

అన్ని జిల్లాలయందును వర్షము పడెను. గుల్బర్గా జిల్లాలోని షాపూరునందు 7.52 అంగుళములును, రాయచూరుజిల్లాలోని సింధనూరులో 0. 0 6 అంగుళములు కురిసెను. రాష్ట్రమునందంతటను సగటున 2.8 అంగుళములు కురిసెను. వరంగల్లు, కరీంనగరము, నిజామాబాదు, నల్లగొండ జిల్లాలలోని కొద్దిభాగములందు యింకను ఎక్కువ వానలకు యుటకు అవసరము. ఈవారమంతయు చలిగాయుండి ఆకాశము మేఘావృతమై యుండెను.

పైరు:

పురుగుచే నాశనమునొందుచున్న నల్లగొండ జిల్లాలోని కొద్దిభాగమందు తప్ప తక్కిన చోట్లంతయు ఖరీఫ్ పైర్లు మంచిఫలితమిచ్చునవ్విగ ముతో కలుపు తీయబడుచున్నవి. కరీంనగరము, మెదకుజిల్లాలలోని పురుగుపట్టి చెడిపోయిన కొద్దిచోటులందు ఆదిపైరుకు విత్తుచున్నారు. మిగతచోటులందు అదిపైరల కలుపుతీయుట, నీరుకట్టు మందుట, నారు నాటుట బాగా జరుగుచున్నవి.

రబ్బీభూముల తయారు చేయుచున్నారు. రాయచూరు జిల్లాలోని కొన్నిభాగములందు రబ్బీభూములకు విత్తుచున్నారు. మరికొన్ని యితరభాగములందు విత్తుట మొదలుపెట్టబడినది.

నీరు, మేత:

రాయచూరుజిల్లాలోని కొన్నిభాగములందు మాత్రమే పశువులమేత చాలినంతలేదు. ఆదిలాబాదు, నిజామాబాదు, గుల్బర్గ, ఉస్మానాబాదు జిల్లాలలోని కొన్నిభాగములందు పశువులవ్యాధి యున్నది.

ధాన్యపుధరలు:

గోధుమలు, బియ్యము, జొన్నలయొక్క సరాసరి చిల్లరధరలు ఈక్రిందివిధముగానున్నవి.

| | | | |
|---|---|---|---|
| గోధుమలు | హాలీ రూ 1కి | 9 1/2 | శేర్లు |
| బియ్యము | ,, | 7 1/4 | ,, |
| జొన్నలు | ,, | 14 | ,, |

అందరును ప్లేగుటీకాలు వేయించుకొనవలసినది. ప్లేగుటీకాలు ప్రతిరోజును పట్టణములలో ఆస్పత్రులలోను, డిస్పెన్సరీలలోను, నగరములో పనిచేయు ప్లేగుశాఖ అధికారులతో యేర్పాటు చేసికొనియు వేయించుకొనవచ్చును. మరియు ప్రతిరోజును నారాయణగుడలో స్పెషల్ ప్లేగు ఆఫీసరుగారి ఆఫీసులోను, బేగంబజారు, మొగల్పురలలో చిన్న కార్యాలయములలోనుకూడ ప్లేగుటీకాలు వేయబడును.

ప్లేగున్నచోట్లనుండి స్నేహితులను బంధువులను హైద్రాబాదుకు వచ్చియుండుటకై పిలుచుటవలన ప్లేగును హైద్రాబాదులో ప్రవేశపెట్టుటయే. ఎక్కడగాని ప్లేగు సంభవించినచో అచుట్టుప్రక్కల యిండ్లవారలు వెంటనే తమకు సమీపములోనున్న హెల్తుక్యాంపుకు పోవలెను.

ఇప్పుడు పంజగుట్ట హెల్తుక్యాంపు తెరవబడియున్నది. క్రమముగా అవసరమువచ్చుకొలది ఇతర క్యాంపులుకూడ తెరవబడును.

# H. E. H. The Nizam's State Railway.

# హి. ఘ. హ. నిజాం రైల్వే

౧ వ అక్టోబరు ౧౯౩౫ నుండి అమలుజరుపబడు ప్యాసెంజరుబండ్లయొక్క రాకపోకలు

## బ్రాడుగేజు (పెద్దలైను)

| | | 2 ప్యాసెంజరు | | 4 ప్యాసెంజరు | | 10 మిక్సెడు | | 12 ప్యాసెంజరు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | గం. | నిమి. | గం. | నిమి. | గం. | నిమి. | గం. | నిమి. |
| వాడి | పో. | 3 | 05 | 11 | 18 | పర్లీనుండి | | | |
| వికారాబాదు | రా. | 5 | 58 | 14 | 06 | 18 | 33 | | |
| | పో. | 6 | 06 | 14 | 14 | 18 | 48 | | |
| హైద్రాబాదు డి. జి. | రా. | 7 | 48 | 15 | 33 | 21 | 11 | | |
| | పో. | 8 | 28 | 15 | 43 | 21 | 24 | 19 | 18 |
| సికింద్రాబాదు | రా. | 8 | 45 | 16 | 00 | 21 | 50 | 19 | 35 |
| | పో. | 9 | 20 | | | | | 19 | 50 |
| కాజీపేట | రా. | 12 | 48 | | | | | 22 | 45 |

| | | 2 ప్యాసెంజరు | | 8 మిక్సెడు | | 6 జి. టి. ఎక్స్ప్రెస్ | |
|---|---|---|---|---|---|---|---|
| బలహర్షా | పో. | | | 12 | 45 | 21 | 30 |
| కాజీపేట | రా. | | | 20 | 45 | 2 | 47 |
| | పో. | 13 | 03 | 23 | 58 | 3 | 10 |
| డోర్నకల్ జంక్షన్ | రా. | 15 | 07 | 3 | 16 | 4 | 58 |
| | పో. | 15 | 24 | 6 | 00 | 5 | 13 |
| బెజవాడ | రా. | 18 | 20 | 9 | 55 | 7 | 40 |
| | | | | | | మద్రాసుకు | |

| | | 1 ప్యాసెంజరు | | 5 జి. టి. ఎక్స్ప్రెస్సు | | 7 ఎఫ్. మిక్సెడ్ | |
|---|---|---|---|---|---|---|---|
| | | గం. | ని. | గం. | ని. | గం. | ని. |
| | | | | మద్రాసు నుండి | | | |
| బెజవాడ | పో. | 5 | 12 | 17 | 30 | 19 | 10 |
| డోర్నకల్ | రా. | 8 | 13 | 20 | 00 | 22 | 58 |
| | పో. | 8 | 31 | 20 | 20 | 23 | 28 |
| కాజీపేట | రా. | 10 | 46 | 22 | 28 | 2 | 30 |
| | పో. | | | 23 | 05 | 6 | 30 |
| బలహర్షా | రా. | | | 4 | 10 | 14 | 03 |
| | | | | ఢిల్లీకి | | వార్ధాకు | |

| | | 1 ప్యాసెంజరు | | 11 ప్యాసెంజరు | | 3 ప్యాసెంజరు | | 9 ప్యాసెంజరు | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కాజీపేట | రా. | | | | | | | | |
| | పో. | 11 04 | | 3 | 20 | | | | |
| సికింద్రాబాదు | రా. | 14 32 | | 6 | 29 | | | | |
| | పో. | 14 50 | 17 30 | 6 | 39 | 9 | 05 | 7 | 12 |
| హైద్రాబాదు డి. జి. | రా. | 15 06 | 17 46 | 6 | 55 | 9 | 31 | 7 | 36 |
| | పో. | ... | 17 55 | | | 9 | 39 | 7 | 52 |
| వికారాబాదు | రా. | | 19 39 | | | 11 | 08 | 10 | 05 |
| | పో. | | 19 47 | | | 11 | 16 | 10 | 15 |
| వాడి | రా. | | 22 30 | | | 14 | 00 | పర్లీకి | |

## వికారాబాదు పర్లీ-వైజ్నాథ్ శాఖ

| | | 9 ప్యాసెంజరు | | 21 మిక్సెడు | |
|---|---|---|---|---|---|
| | | గం. | నిమి. | గం. | నిమి. |
| | | నేరుగా సికిం. బా. నుండి | | | |
| వికారాబాదు... | రా. | 10 | 05 | | |
| | పో. | 10 | 15 | 15 | 16 |
| మహమ్మదాబాదు-బిదర్ | రా. | 13 | 11 | 18 | 38 |
| | | మిక్సెడు | | | |
| | పో. | 13 | 29 | | |
| భాల్కీ | పో. | 14 | 53 | | |
| పర్లీ వైజ్నాథ్ | రా. | 20 | 38 | | |

| | | 10 మిక్సెడు | 22 మిక్సెడు |
|---|---|---|---|
| | | గం. ని. | గం. ని. |
| పర్లీవైజ్నాథ్...... | పో. | 7 30 | |
| భాల్కీ- | పో. | 13 14 | |
| మహమ్మదాబాదు-బిదరు | రా. | 15 05 | |
| | పో. | 15 17 | 10 04 |
| వికారాబాదు... | రా. | 18 33 | 13 26 |
| | పో. | 18 45 | |
| | | నేరుగా సికిం. బా. | |

## డోర్నకల్ జంక్షన్-సింగరేణికాలరీసు శాఖ

| | | 18 మిక్సెడు | | 20 మిక్సెడు | |
|---|---|---|---|---|---|
| | | గం. | నిమి. | గం. | నిమి. |
| డోర్నకల్ జంక్షన్ | పో. | 5 | 35 | 15 | 40 |
| సింగరేణి కాలరీస్ | రా. | 10 | 00 | 17 | 00 |

| | | 17 మిక్సెడు | | 19 మిక్సెడు | |
|---|---|---|---|---|---|
| | | గం. | నిమి. | గం. | నిమి. |
| సింగరేణి కాలరీసు | పో. | 12 | 45 | 18 | 30 |
| డోర్నకల్ జంక్షన్ | రా. | 14 | 0 | 19 | 50 |

## డోర్నకల్ జంక్షన్ భద్రాచలంరోడ్డు శాఖ

| | | 16 మిక్సెడు | |
|---|---|---|---|
| | | గం. | ని. |
| డోర్నకల్ జంక్షన్ | పో. | 9 | 25 |
| భద్రాచలం రోడ్డు | రా. | 11 | 33 |

| | | 15 మిక్సెడు | |
|---|---|---|---|
| | | గం. | ని. |
| భద్రాచలం రోడ్డు... | పో. | 12 | 53 |
| డోర్నకల్ జంక్షన్ | రా. | 15 | 00 |

# రజతోత్సవపు టప్పా టికెట్లు

మ. ఘ. వ. ప్రభువుగారి రజతోత్సవ గౌరవార్థము టప్పాశాఖవారు (చక్రవర్తిగారి విషయమున జరిగినవిధమునసే) ప్రత్యేకముగ టప్పా టికెట్లు సిద్ధపరచుచున్నారు. వీటిమీద విఖ్యాత మందిరముల పటము లీ క్రింది విధమున నుండునట'

నాల్గుపాయిల టికటుపైనయూనానీ వైద్యశాల
ఎనిమిది ,, ఉస్మానియా ,,
అణా ,, ,, విశ్వవిద్యాలయం
రెండణాల ,, జూబిలీహాలు

---

# కల్లుసారాయిమాహాత్మ్యము

## హత్యలమొకద్దమాతీర్పులో హైకోర్టు రిమార్కు

[నవాబ్ మిర్జాయార్‌జంగు బహదర్, గాజిమొద్దీన్ అహమద్ గార్ల యెదుట]

"కల్లుసారాయి త్రాగుటవలన కలుగు దుష్ఫలితములు కొంతవరకు యీనేరములకు కారణములై యుండెను. ముద్దాయీలు నేరము చేయుటకు ముందు ఆ దుష్ఫలితములకు అధికముగాలోనై తాము యేమి చేయుచున్నదికూడ తెలియక యుండిరి. ఆ దుష్ఫలితము నుండి వారు తప్పించుకొనజాలకపోయిరి."

ఇది హైకోర్టు న్యాయమూర్తులు, నవాబ్ మిర్జాయార్‌జంగు బహదర్ గారును, గాజిమొద్దీన్ అహమ్మద్‌గారును డివిజనల్ బెంచిలోకూడి ఒక మరణదండనను యావజ్జీవ కారాగారవాసమునకు తగ్గించుచు నుడివిన వచనములు. మొదటిసారి యీనేరమును హైకోర్టులోనే రాజాబహాదర్ రాయ్‌విశ్వేశ్వరనాథ్‌గారు విచారించి తీర్పుచెప్పిరి. ఆతీర్పును స్థిరపరచుటకై డివిజనల్ బెంచికి పంపిరి.

ప్రాసిక్యూషన్‌వారు చెప్పిన దేమనగా, కొన్ని హత్యలవిచారణ సందర్భములో తుల్జారాంఅను నతడు పట్టుకొనబడి ధూల్పేటలో నుండు బాలూసాను, పీల్ఖానాలో నుండు రాజమ్మను చంపెనని ఒప్పుకొనెను. తుల్జారాం తాను ఒప్పుకొనుటయేగాక జతూసా అను మరియొకనినికూడ తనతోటి నేరముచేసిన వానినిగ చేర్కొనెను. వీరిరువురునుచేరి దుర్నీతిగల స్త్రీలను పిలిపించి, వారికి కల్లుసారాయి బాగుగ త్రాగించి, తర్వాత వారిని యెవ్వరును కాపురము ఉండనిచోటునకుతీసికొనిపోయి, అక్కడనే వారిగొంతులను పిసికి, శవములపై నుండు సొమ్ములను గుంజుకొనిపోవుటకు [illegible]. [illegible] నేరస్థులను ప్రత్యేక ప్రత్యేకముగా నాల్గవ ఫౌజ్దారిబల్దా హాకిం అగు రాయ్‌బ్రిజ్‌మోహన్‌లాల్‌గారి యెదుట చంపబడినవారిని పూడ్చిపెట్టబడిన చోట్లను పోలీసులకు చూపించియుండిరి. ప్రాసిక్యూషన్ పక్షమున బ్రిజ్‌మోహన్‌లాల్‌గారి సాక్ష్యము తీసికొనబడెను. నేరస్థులువలుచుకొనిపోయిన సొమ్ములు యెవరెవరికి అమ్మబడెనో వారందరు తమ సాక్ష్యములో నేరమును స్థిరపరచిరి. జూరీపెద్దలుకూడ నేరమును స్థిరపరచిరి. రాయ్‌విశ్వేశ్వరనాథుగారు యిరువురు నేరస్థులకుకూడా మరణదండన విధించిరి

ఈ తీర్పు నవాబు మిర్జాయార్‌జంగుబహాదర్ గారివద్దకు ఖాయముకై రాబడెను వారు తమ అభిప్రాయము చెప్పుచు తుల్జారాముకు యిదివరకే మరణదండన, మరికొన్ని నేరముల సంబంధమున మరణదండనలు విధించబడియుండెననియు, ప్రస్తుతము మరణదండన విధించుటకు తగినంత ప్రత్యక్ష సాక్ష్యము లేదనియు, కాబట్టి మరణదండన యావజ్జీవ కారాగారవాసముగా మార్చబడవలెననియు తీర్పుచెప్పిరి

---

# క్రొత్త మోటారుకారుల పన్ను

ప్రభుత్వ ప్రకటన శాఖనుండి ఈక్రిందివార్త మాకు ప్రచురణార్థమై వచ్చినది:

మోటారు కార్ల నిబంధనలలో, ఇప్పుడు స్వంతకార్లమీదను, టాక్సీలమీదను వసూలు చేయబడుచుండు మునిసిపలు పన్నుకు తోడు మరియొకపన్ను (ప్రావిన్షియల్ పన్ను) గూడ విధింపబడ నున్నది. దానికి ప్రభుత్వమువారి అనుమతియే మిగిలి యున్నది. రోడ్ల మీద మోటార్లు అధికముగా తిరుగుచుండుట వలన ఆరోడ్లు త్వరలోనే చెడిపోవుట సంభవించుచున్నది. ఇదియుకాక కొన్నిరోడ్లు బరువు గలిగిన మోటార్లయొక్క బరువును సహించునంతటి గట్టిగా తయారుచేయుటకు అగు ఖర్చులను పబ్లిక్ వర్క్సు శాఖ ప్రస్తుతము భరింపజాలకయున్నది. అందువలన ఈక్రొత్తపన్నువిధించుట కవసరమేర్పడినది. ఈ ఆదాయముతో ప్రజా సౌకర్యమునకై రోడ్లను సరియైనస్థితిలో నుంచుటకొరకు ప్రత్యేకమైన నిధి యొకటి ఏర్పాటు చేయబడవచ్చును. బ్రిటిషు యిండియాలో ఇటులనే ఎక్కువ పన్ను విధింపబడుచు ప్రత్యేకనిధి పద్ధతి చాలకాలము నుండి యున్నది. కాబట్టి ప్రభుత్వమువారి అంగీకారము అయినతర్వాత మోటారు కార్ల నిబంధనలు అమలులోనికి వచ్చు రోజు నుండి అనగా 1అజూరు 1345 ఫ. నుండి ఈక్రొత్తపన్ను మ. ఘ. వ. నైజాం రాష్ట్రమునందంతటను విధింపబడును. బాడుగ కార్లకు, బస్సులకు, లారీలకు మాత్రము నిబంధనలలోగల పన్నులపై, మొదటి సంవత్సరమునందు నూటికి ఏబది వంతునను, ఆటుపైన రెండేండ్ల వరకు నూటికి యిరువదియైదు వంతునను మాఫీ యొసంగబడును.

నిబంధనలలోని రేటు ఈ క్రింది విధముగ నున్నవి:—

1. ప్రక్క తొట్టిలేని మోటారు సైకిలుకు రూ. 5/- 2. ప్రక్కతొట్టిగల మోటారు సైకిలుకు రూ. 7/- 3. సామాను లేనప్పుడు 1 1/2 టన్నుల లోపు బరువుగల స్వంత కార్లకు రూ. 16/- 4. సామాను లేనప్పుడు 1 1/2 టన్నుల నుంచి 3టన్నులలోపుబరువుగల స్వంత కార్లకు రూ. 32/- 5. సామాను లేనప్పుడు 1 టన్ను లోపు బరువుగల ట్రక్కులు (ట్రైలర్లకు) రూ. 10/-

### కిరాయ టాక్సీలకు

6. ఆర్గురు ప్రయాణీకుల వరకు స్థలముండువాటికి రూ. 50/- 7. ఆర్గురికిపైనుంచి పదిలోపు ప్రయాణీకులకు మించని స్థలముండు వాటికి రూ. 80/- 8. పది మందినుంచి పదునైదుమంది ప్రయాణీకులవరకు స్థలముండువాటికి రూ. 120/ 9. పదునైదు మందినుంచి యిరువదిమంది ప్రయాణీకుల వరకు స్థలముండువాటికి రూ. 160/- 10. ఇరువది ప్రయాణీకులకు మించి స్థలముండు వాటికి సీటుకు రూ. 12/-

### బాడుగ లేక స్వంత లారీలకు

11. సామాను లేనప్పుడు 15హండ్రడ్లలోపు బరువుగలవాటికి రూ. 50/- 12. సామాను లేనప్పుడు 15 హండ్రడ్లనుంచి 1 1/2 టన్నులలోపుబరువుగలవాటికి రూ. 100/- 13. సామాను లేనప్పుడుఅదనపుప్రతి1/2 టన్నుకు రూ.50/- 14 సామానుండు ట్రైలరుకు ప్రతి 1/2 టన్నుకు రూ 50/-

---

# 14రూపాయలకు ప్లీడర్లు

చదువుకున్న యువకులలో నిరుద్యోగ సమస్య అతితీవ్రముగా సంయుక్త పరగణాలలో ఉంది కొంత మంది పోలీసు కానిస్టేబులు ఉద్యోగములో ప్రవేశిస్తున్నారు.

అంతకన్నా విచారకరమైన విషయము ముగ్గురు బి. ఎల్. ప్యాసయినవాళ్ళు కోర్టులో నెలకి ౧౪ రూపాయల జీతముమీద ఉద్యోగానికియిటీవలచాఖలు అయినట్లు తెలుస్తున్నది

---

# గాంధి గారి పద్ధతి వ్యర్థమైనచో

## రోమెయిన్ రోలెండు గారికి సుభాస్ చంద్రబోస్ గారి ప్రశ్న

సుభాస్ చంద్రబోస్‌గారు యూరపులో అనేకులనుండి భారత రాజకీయములను గూర్చి అభిప్రాయములను తెలిసికొనగా, యూరపీయులందరికిని భారత రాజకీయములను గూర్చి తెలిసికొనవలెనను కుతూహలము గాంధిమహాత్ముడు అందులో చేరియుండుట వలననే కలిగినదని తెలిసినది. అనగా గాంధిమహాత్ముని పద్ధతి గెలిచినను ఓడినను భారత రాజకీయములందలి వారిదృష్టి, ఆదరము అంతయు గాంధి మహాత్మునితోనే అంతమగునన్నమాట. బోస్‌గారికి యిది ఆందోళనగా నున్నది. గాంధిగారి ఉద్యమము వ్యర్థమై భారత దేశ స్వాతంత్ర్యమును సంపాదించజాలనిచో, అప్పుడు సోషలిజమే (అనగా కార్మికులను, రైతులను రాజకీయ రక్షమునకు గట్టుటయే) శరణ్యమని సుభాస్‌బోస్‌గారి అభిప్రాయము. ఈఅభిప్రాయమునకు అందరును అంగీకరించునట్లు చేయుటకై సుభాస్‌బోస్‌గారి యత్నము. ఇదే ఉద్దేశ్యముతో బోస్‌గారు యిటీవల రోమెయిన్ రోలెండుగారితో కలిసి మాట్లాడుచు గాంధిగారి ఉద్యమము విఫలమైనచో తరువాతి గతియేమి అని ప్రశ్నించిరి. ప్రశ్నించి తానుకనుగొనిన యితర యూరపీయుల అభిప్రాయమునుగూడ తెలియజేసిరి. రోలెండు గారికి మాత్రము గాంధిగారిమీద విశ్వాసము అంతసులభముగ ఊడిపోవునా? అందువలన ఆయన ఆలోచించి మాట సందుబోనీయకుండ చాల జాగ్రత్తగా నిట్లుచెప్పెను: "పరిస్థితులు మారి గాంధిమహాత్మునికి పని చేయువారల ఉద్యమముతోను, దేశద్రవ్యము నంతయు పనివారలతోగూడ కలిపి అందరికిని దాదాపు సమానముగ పంచునట్టి యేర్పాటులోను ఘర్షణ సంప్రాప్తమైనచో, నేను యెన్నటికిగాని సకలబాధల ననుభవించు కార్మికుల పక్షమునసే చేరెదను." ఈఅభిప్రాయమునుగూర్చి బోసుగారు "నాకు ఒక్కమ్మడి సంతోషమున్ను, ఆశ్చర్యమున్ను గలిగినవి. నేను యెంతో సంతోషముతోనున్న సమయములలోగూడ యీగొప్ప మేధావి యింత ధైర్యముగాను, నిస్సంకోచముగాను కార్మికుల ఉద్యమమునకు చేయూత నిచ్చునని యెన్నడును అనుకొనియుండలేదు." అని మాడర్న్‌రివ్యూలో ఒకవ్యాసమందు వ్రాసినారు.

రోలెండుగారికి జవాబిచ్చుచు బోసుగారు గాంధిమహాత్ముని లోపములనుగూర్చి ఉపన్యసించిరి. "వారికి లోపలనున్న రహస్యములనన్నిటిని దాపరికము యేమాత్రము లేకుండ బైటపెట్టు దురభ్యాసము గలదు. అదియుగాక మానరు. రాజకీయనులందు వారి భిన్నాభిప్రాయములను వెలివేయుటకు వారు సమ్మతించరు; ఇదియు ఒకలోపము. బ్రిటీషు ప్రభుత్వమువారి హృదయము యెన్నడో ఒకనాడు మారగలదని ఆశ."

మరల రోమెయిన్ రోలెండు గారు తమకు గాంధిమహాత్మునిపై విశ్వాసము పోలేదనిచెప్పిరి. కాని సుభాస్ చంద్రబోసుగారు రోలెండుగారిని తమపక్షమునకు త్రిప్పుకొనినట్టే విశ్వాసము.

---

# పుష్పోద్యానము (బాగెఆమ్మా) లో మార్పులు

రజతోత్సవ ఉత్సవముల సందర్భమునవచ్చుటమార్పులు జరుగుచున్నవి పడమటప్రహారీగోడతీసివేసి ఇనుపకడ్డీలతో అవరణ మేర్పడచేదరు తోట నడుమ నున్న సరస్సు ఎండగొట్టెదరట!

---

# హిందూమతమున చేర్చుకొనుట శాసనసమ్మతమే

బుస్సేర్ సంస్థాన ప్రభువుగారిఆజ్ఞ

సిమ్లా హిల్సులో బుస్సేర్ సంస్థానమున్నది. అక్కడి కొండప్రాంతప్రజనులను సంస్కరించి మంచినాగరకులను చేసిన అమెరికన్ మిషనరీ ఇ. స్టోక్సుగారు హిందూమతములో చేర్చుకొనబడి శ్రీయుత సత్యానందుడైరి. దీనిపై విభిన్నమతములవారలు రెండుపక్షములై వివాదములతో అదాలతునెక్కిరి. వానిమీదట హిందూమహాసభ్యులును, ఆర్యసమాజీయులును కొందరుకలసి భాయిపరమానంద్‌గారి నాయకత్వమున బుస్సేర్ రాజాసాహెబ్‌గారివద్దకు రాయబారులుగాపోయి యితరులను హిందూమతములో చేర్చుకొనుట శాసనసమ్మతమేనని స్పష్టము చేయవలసినదిగకోరిరి. అందుపై రాజాసాహెబుగారు న్యాయసమ్మతమేనని ప్రకటించిరి. ఆసంస్థానాధికారులు వచ్చినరాయబారులకు బండ్లు మొదలగు అన్ని సౌకర్యములను కలిగించిరి.

* * *

బీహారు ప్రభుత్వమువారు ప్రభుత్వోద్యోగులకు యితరులకు తెలుపగూడని ఒకరహస్యమైన ఆజ్ఞను పంపయుండిరి. ఆయాజ్ఞలో కొందరు ఆర్యసమాజీయులు క్రైస్తవులకు విరుద్ధములైన చర్యలను వేటివేటిని చేయుచున్నారో గమనించవలసినదనియున్నది. ఆ రహస్యమెట్లు బైటపడినదో—మొన్నటి బీహారురాష్ట్ర శాసనసభలో ఆవిషయమై వివరములను ఆకర్షించుటకు ప్రశ్నలవర్షము కురిపించబడెను. హోంమెంబరుగారు ఆప్రశ్నలకన్నిటికిని సమాధానమిచ్చుచు, అట్టి రహస్యాజ్ఞను జారీచేసిన మాట వాస్తవమేననియు, యేమత ప్రచారకులుగాని తమ ప్రచారము చేయుచున్నప్పుడు యితర మత సంస్థలతో సంఘర్షణగాని మతసంఘర్షణలుగాని జరుగకుండచూచుటకై ఆఆజ్ఞ జారీ చేయబడినదనియు చెప్పిరి.

---

# కోత్వాలుకు క్రొత్త అధికారము

ఇటీవల ప్రభుత్వముగారివలన అంగీకరింపబడిన కోత్వాలీ నియమావళి ననుసరించి సమావేశములను, ఊరేగింపులను నిషేధించుటకును, అపుటకును, అల్లరులనడచు శాంతిని స్థాపించుటకును, మత సంబంధమైన సంరంభములలో నెమ్మది నెలకొల్పుటకును, అల్లరి మూకలు (గ్యాంగులు) మొదలగువానిని రాకపోకలను నిర్బంధపరచుటకును ప్రత్యేకాధికారము లియ్యబడినవి.

## మహారాజా బహదర్ గారికి అల్పాహారపు విందు

మహారాజా బహదరుగారి గౌరవార్థము శ్రీయుత కృష్ణస్వామి ముదిరాజా (పురపాలక సంఘసభ్యుడు) గారు చుడీబజారులోని తమ స్వంత గృహమున ౯ ఆబాన్ నాడు సాయంత్రమున గొప్ప విందు చేసిరి. గొప్ప గొప్పవారనేకులు వచ్చిరి. ఆ ప్రదేశము రంగు రంగుల తోరణములతోను పతాకములతోను అలంకరింపబడెను. ప్రభుత్వాధికారులలో వచ్చిన అతిథులు: నవాబు సఆదత్ జంగు బహదరు, రాజా బహదరు విశ్వేశ్వరనాథు, నవాబు ముసాహబ్ జంగు బహదరు, నవాబు జైను యార్ జంగు బహదరు, కర్నలు నవాబు సుల్తాన్ యార్ జంగు బహదరు, నవాబు అస్గరు యారుజంగు బహదరు, నవాబు రావుసాహెబ్ ఖాన బహదరు, రాయ్ భవానీప్రసాదు సా.

వీరందరును పుష్పమాలాలంకృతులుగా జేయబడిరి. మిఠాయిలను భక్ష్యములు, పానీయములు అమర్పబడియుండెను. చాల ఉత్సాహము ప్రబలియుండెను.

## ప్రభువుగారి రజతోత్సవము

రజతోత్సవ నిధికి ఇండియా ప్రభుత్వమువారి వర్తక శాఖామంత్రి, సర్ జఫరుల్లాఖానుగారు నూరు రూపాయలను, నవాబు సర్ మసఊదుజంగు బహదరు అయిదునూర్ల రూపాయలను పంపినారని సికింద్రాబాదు రజతోత్సవ శాఖవారు ప్రకటించుచున్నారు.

ఆకస్మిక మరణము

# డాక్టర్ గారిని పోలీసులు పట్టుకొనుట

(మన విలేఖరి)

ఉంబా బజారులో పోయిన శ్రావణ బహుళ ఏకాదశి ప్రాంతములో ఒకనాటి రాత్రి బిస్తి నారాయణ అను నతడు లక్ష్మయ్య అను భాగ్లీ డాక్టరు యింటికిపోయి తమాషాగా మాట్లాడుచు కూర్చొనియుండ్లు కొంతసేపటికి స్పృహతప్పి పడిపోయినట్లు కల్లోలము లేచెను. ఇరుగుపొరుగు వారందరు వచ్చి చూచునంతలో శవము మాత్రమే యుండెను. వెంటనే ఆ సమాచారము పోలీసులకు తెలియగా వారువచ్చి విచారణచేసి శవమును దహనమునకై యిచ్చివేసిరి. తర్వాత ఆ డాక్టరుగారు అనుమానముపై పోలీసువారిచే పట్టుకొనిపోబడిరి. పోలీసువారి విచారణ చాలవరకు పూర్తియైనది. డాక్టరుగారు ఆ యువకుని చంపుటకు యితరులు పన్నిన కుట్రలో తనుల్కొని యే దోమందు పెట్టినట్లు ఆఖరుకు తేలినట్లు తెలియుచున్నది. క్రమముగా పట్టుకొనబడిన వారిపై న్యాయస్థానములో మొకద్దమా ఫౌజ్దారీ పెట్టబడవచ్చును.

## వై. యం. సి ఏ క్రొత్తమందిర ప్రారంభము

౧౦ ఆబాను నాడు సాయంత్రము ౫-౪ గంటలవేళ వై. యం. సి. యే. యొక్క క్రొత్త మందిరము (నారాయణగూడెము) యొక్క శంకుస్థాపనోత్సవము శ్రీ మహారాజా బహదరు (ప్రధానామాత్యవర్యులు) గారివలన జరుప బడినది. ఆ సందర్భమున శ్రీ. రెని జెంటుగారు, వై. యం. సి. యే. సంఘము యొక్క ఉద్దేశములు మొదలైనవి విపులముగ నుపన్యసించిరి. గొప్ప అధికారులు చాలమంది వచ్చియుండిరి. మహారాజా బహదరు పదివేల రూపాయల విరాళమును ఈ సంస్థకై ప్రకటించిరి. మరి రెండువేల అయిదువందల రూపాయల విరాళములు యితరులు వాగ్దానమొనర్చిరి. ఆ సభులకు అల్పాహారములు అమర్చబడినవి.

# వైర్లెస్ శాఖకు సలహా సంఘము

౧౫ జూలై ౧౯౩౪వ తేదినాడు వైర్లెస్ బోర్డువారు గావించిన తీర్మానము ననుసరించి గౌ॥ ఆర్థికశాఖా మాత్యుని అంగీకారముతో నవాబ్ అఖీల్ జంగు బహదర్ గారు అధ్యక్షులుగ, యీక్రిందివారు సభ్యులుగను ఒకకమిటీ యేర్పరచబడినది. మ.ఘ.వ. నిజాం ప్రభుత్వమువారి బ్రాడ్కాస్టింగు స్టేషనునుండి బ్రాడ్కాస్టు చేయదగిన విషయములను గూర్చి యీ కమిటీ సలహా నిచ్చుచుండగలదు.

౧. మీర్జా అలియార్ ఖాన్ గారు, ప్రకటన శాఖాధ్యక్షుడు.
౨. నవాబ్ జైన్ యార్ జంగు బహదర్. పురపాలక సంఘపు అధ్యక్షుడు.
3. కల్నల్ జె. నార్మన్ వాకర్, వైద్య శాఖాధ్యక్షుడు.
౪. కాజీ మహమ్మద్ హుసేన్, ఉస్మానియా విశ్వవిద్యాలయపు వైస్ ప్రిన్సిపాల్.
౫. సహకార సంఘముల రిజిస్ట్రారు.
౬. డాక్టరు వ్యాగ్నో.

(ప్రకటన శాఖనుండి)



వేమన గ్రంథాలయము

గద్వాల మహారాణిగారి విరాళము

గద్వాల మహారాణిగారు తమకొండవ కుమారై వివాహసందర్భమున, ఈ నిలయమునకు 25 రూపాయలు [ఇరువదిఅయిదురూపాయలు] దయతో నిచ్చినారు. వారి అదర్శప్రాయమైన ఔదార్యమునకు ఈనిలయమువారెంతయు కృతజ్ఞులు.

కె. సుబ్బారావు, గారు
కార్యదర్శి.

## పానిపతు మొదటి యుద్ధమును ప్రదర్శించుట

ఉస్మానియా శాఖరియా పాఠశాలలోని బాలురు ౫ ఆబాను నాడు హిందూదేశ చరిత్రమునందలి విఖ్యాతమగునీయుద్ధమును ప్రదర్శించిరి. ఆరంగముల పటములు తీసికొనబడినవి. బాలురు మనోహరముగ పనిచేసిరట.

(పానిపతు మొదటియుద్ధము ౧౫౨౬లో బాబరు (మొగలు చక్రవర్తి) నకును, ఇబ్రాహీము (లోడీవంశ చక్రవర్తి)నకును జరిగినది. దీనిలో రాణాసాంగాఅను రసపుత్ర వీరుడు వీరవిహారము సల్పియుండెను. ఈయుద్ధము హిందూదేశ చరిత్రమునందు మధ్యమ యుగమున ముఖ్యమైన వానిలో నొకటి. పానిపత్తునందు మూడుమారులు ముఖ్య యుద్ధములు జరిగినవి: యుద్ధములో ప్రతియుద్ధము గొప్పమార్పుల కలిగించినది.) (గో.ప. సం.)

## నిజాంరాష్ట్రపు ప్రాచీన చారిత్రిక చిహ్నములు

అర్కశాఖ (అసారుఖదీము) యొక్క నాజిము అగు యజ్దానీగారు ౧౦ ఆబాన్ నాడు సాయంత్రము రేడియో ద్వారా మన రాష్ట్రములోని పురాతన వస్తు పరిశోధనమును గూర్చి విద్వత్పూరితమగు నుపన్యాసము చేసిరి. "చరిత్రకు పూర్వకాలపు చారిత్రక చిహ్నములు దక్కనులో" అను విషయమున నీ యుపన్యాసము చేయబడినది.